ఉమార్ ఖయ్యామ్

అను పారసీకకవి వ్రాసిన

# ==॥ రు బా య త్ ॥==

అను పద్యములకు తెలుగు.



కర్త:

చిలుకూరి నారాయణరావు.

# ప రి చ య ము.



ఈపద్యకావ్యము పురాతన పారసీక కవియైన 'ఉమార్‌ఖయ్యామ్' అనే సుప్రసిద్ధ కవివ్రాసిన పద్యములకు తెనుగు. ఈ పద్యములు అనేక భాషలలోనికి పరివర్తితములైనవి. మనవారుకూడా కొన్నికొన్ని పద్యముల నాంధ్రీకరించి ప్రకటించినారు. ఉమార్‌ఖయ్యామ్ వ్రాసినవని వాడుకలో ఉన్న పద్యము లనేకములున్నవి. వానిలోని 101 పద్యములకు ఫిట్జ్‌గెరాల్డు అనుకవి ఇంగ్లీషు పద్యములను వ్రాసినాడు. ఆయన అనువాదముమిక్కిలి ప్రసిద్ధికెక్కినది; కాని, ఆయన పారసీకకవి యభిప్రాయమును కొంతవరకు తన భాషాస్వాస్థ్యమున కనుగుణముగ మార్చి కూర్చినాడు.

ఈ చిన్నపుస్తకములోని షట్పదులు పిట్జ్‌గెరాల్డు తీసికొన్న పద్యములకే అనువాదము; కాని, పారసీకకవి యభిప్రాయము

నిందులో మార్చక ఉంచినాను. కవి అభిప్రాయములు భావగర్భితములై మిక్కిలి మనోహరములుగా ఉన్నవి. అట్టి అభిప్రాయములకు ముత్యాలసరములను పేరితో ఇప్పుడు వ్యవహారములో ఉన్న పూర్వకాలపు ఆంధ్ర కర్ణాటక షట్పదులు సరియైన శరీరమగునని యెంచి పద్యములను రచించినాను.

ఉమారుకవి యభిప్రాయములమీది గౌరవముచేత నయినా, నా యీప్రయత్నమును ఆంధ్రులు ఆమోదింపకపోరని నా నమ్మకము.

గ్రంథకర్త.

# ఉమార్ ఖయ్యామ్

[ముత్యాలసరములు]

౧

మేలుకో! యదె వేయికరముల
వేలు పుడుగణములను ముందట
తోలి రాత్రిని వెంబడించుచు
దూరుచున్నాఁడు.

బాలభానుఁడు వాఁడె పాదుస
మేలుకోటను ముట్టడించెను
లీలఁ గరశరములను బురుజుల
పైని దాఁకుచును.

౨

ఉదయఖల మందేహులకు మృతి
యొదవుటకు నొక యింతపూర్వము
"పదర, భక్తుఁడ! యేల కునుకుచు
ఒదిగి యున్నావు?
ఇదిగదా దేవాలయము మఱి
ఇదిగో, సర్వము సిద్ధమైనది
పదర," యను వాక్కొకటి వీనుల
గదిసెనచ్చటను.

౩

ఈడ నే ముండేటి కాలము
దాటిపోతున్నాది మఱి అది
దాటిపోతే తిరిగి వచ్చే
మాటయేమొకదా.
కొక్కురో అని కోడికూసెను
కొట్టు "తలుపును తీయవే" మని
కూడియుండిన వారు నాత్రము
తోడ నార్వఁగను.

౪

చైత్రమాసము డాయుచున్నది
చిత్రమగు నాశలను గొల్పుచు
ఆత్మయును నాత్రమున మఱుగున
కరుగు చున్నయది.

మిత్రుఁడునువలె మోసెసు తన ప
విత్రహస్తము సాయముగ చా
రిత్రముల సరిచేయ ఏసును
వచ్చుచున్నాఁడు.

౫

మే గులాబీ పూలతోడను
సీగ్లె 'సిరామ్'; 'జామునీదు'ను
పల్గతుల నెచ్చటికి పోయెనో
ఎవరు నెరుఁగరుగా.

కగ్లైనెనను మధురసంబులు
చిల్కుదాక్షవనంబు, లవియును
గల్గు నదియొడ్డునను నిదియే
నిత్యమనునట్లు.

౬

ఇదె కదా సౌఖ్యంపుదిన మన
నొదవ దివు డాతపము శీతము
పదనుతోడ గులాబిమొగమును
దుడిచె వర్షంబు.
మృదుమృదూక్తులఁ బల్లవులతో
నొదలు సల్పుచు భరతపక్షియు
నిదె గులాబికి, త్రాగుమీ, మది
రం బనుచుఁ బల్కున్.

౭

పోయరా యీగ్లాసునిండా
త్రోయరా పరితాపవసనము
నాయెరా చలికాలమిఁక, వా
సంతికార్చులివే.
డాయుచున్నది కాలవిహగము
పాయఁగా నియమిత మిదంతయు
హాయిగా నది యింతలోనే
మొగిరిపోవుఁగదా.

౮

ఏదో యొక్కటి, 'బాల్ఖా,' మఱి 'బా
గ్దాదో' యేదో, గ్లాసులోపల
చేదో, తీపియొ, యుండు నిఁకపై
దానిపని యేమి?

పాదుకొన్న జీవమను నీ
స్వాదుద్రాక్షారసంబు చిందఁగ
మీఁదఁ బ్రాణములనెడు పత్రము
లెల్ల రాలఁగను.

౯

తెల్లవారఁగ వేయ్‌గులాబీ
లొల్లముగఁ జేకూరునందువు;
కల్ల; నిన్నటి మేల్గులాబీ
యెచటి కేఁగెనయా.

పల్లవించెడు కాలమది కడు
చల్లనే యౌఁగాని యిప్పటి
కెల్లరాజులు రెడ్డులును మఱి
చల్లఁబడుదురుగా.

౧౦

పోవనీ వా రిష్టమైనటు,
దాన మన కేమిపని యున్నది
గాన 'కైకోబాదో' 'ఖుసురో'
యెవ్వరైన సరే.
దానకర్ణుఁడు 'హాతిముని' స
ఖ్యాన, 'రుస్తుము' వీరవాక్కుల
న్యూనతంబొందంగ నేఁటికి
లక్ష్యమేఁటికిని.

౧౧

ఒక్కఁడొక సుల్తానుగానీ
యొక్కఁడొక బానిసయుఁగానీ
యక్కడను బంగారుగద్దె ము
హమ్మదుండఁగనీ
ఒక్క ప్రక్కను నిసుకబయలును
ఒక్క ప్రక్కను సస్యభూమియు
నిక్కడను పచ్చికల మీఁదను
గూరుచుందాము.

౧౨

పట్టముగ వ్యాపించియున్న
చెట్టునీడను పాటపొత్తము
రొట్టె యొక్కటి, ద్రాక్షరసముల
గ్లాసు నుండఁగను.
అట్టెనీవును నాదుపజ్జను
మట్టుగాఁ బాడుచును నుండఁగ
నట్టియిసుక యెడారిస్వర్గము
లీలనుండుఁగదా.

౧౩

ఆరయుదు రైహికసుఖంబుల
నారయుదురును బరసుఖంబుల
వారిలోనను వీరిలోనను
నేరుజ్ఞానులొగా!
ఆరుకాసుల యరువుకంటెను
మూఁడుకాసుల రొక్కమే మేల్
దూరముగనున్నట్టి యాశల
కేలపోయెదవు?

౧౪

అల్లదే! విరియుచు గులాబీ
మెల్లఁగాఁ బల్కెడును, "వినుమో
చెల్ల! నవ్వుచుఁ గేరుచిటకును
చేరికొంటి,నుమీ.

కొల్లగా ధనమున్న సంచికి
చిల్లిపడియెను, ధనమదంతయు
నెల్లయెడలను నీవనంబున
జారవిడిచితిని."

౧౫

అట్టి యీ బంగారుధాన్యము
నెట్లనను గాచికొని కొందఱు
చెట్టయిది యేమనుచు గాలికి
నెగచి కొందఱును,

ఎట్టులైతే నేమి బంగరు
మట్టి యౌదురె వారు వీరును?
మట్టిఁ జేరిన పిదప నేరిని
త్రివ్వితీయ రెకా.

౧౬

ఐహికంబులు జనులు చేసెడి
యూహాలన్నియు భస్మమౌ, ను
త్సాహవంతుని జేసి కొండొక
వృద్ధి నొందించు.
ఊహ లేటికి ఇసుకబయలను
ఆ హిమంబట్టులను నిపుడే
వే హరించుక పోవు; నవి మఱి
యేటి కయ్యయ్యో.

౧౭

ఈజగం బిదియొక గుడారము
బూజుపట్టియుఁ జినిఁగె, నాఁడ
ర్వాఁలౌ రాత్రియును బగలును
దాని కందులను
రాజులెందఱొ వరుసవెంబడి
నోజ హశాసున పెక్కు మీఱిరి
రోజు వచ్చిన నెఱువారై
వెడలి పోయిరిగా.

౧౨

జాముషీద్ సుల్తాను రాజ్యము
గోముమీఱఁగఁ జేసి త్రాగిన
భూములో కోటలను సింహము
బల్లి యుండునఁట.

ఆమహాత్ముఁడు వ్యాధరాజని
యేమొ కీరితిఁ గన్నయట్టి 'బ
హ్రాము' తలపై నడవిగాడిద
యాడుచున్నయది, యతఁడు మేల్కానఁడు.

౧౩

ఎవ్వఁడో 'సీజరు' గతించియుఁ
బవ్వళించినచోట రక్తపు
చెవ్వచేతనె యంతమెఱుపు గు
లాబియొందుననీ,

యివ్వనంబునఁ గల్గు మల్లె
పువ్వునొక యలిచికురకబరిది
చివ్వనను నిట జారిపడియె న
టంచుఁ దలఁచెదను.

౨౦

చిగురులెత్తెను మొలకయిది ప
చ్చగను నదియొడ్డునను నోహో
చిగురు మోవిరుదేవా యిటఁ బ్రిస
వింపఁ జోలుఁ జుమీ.

అగషుచెందుము, నలిగిపోవును
మిగుల మెల్లఁగ నిశము కాలిని
వగలఁ బెట్టకు దానిపైఁబడి
త్రొక్కి వేయుచును.

౨౧

ఓయి, మిత్రుఁడ గ్లాసునిండా
పోయరా మధురసముఁ; బూర్వపు
గాయముల రాఁబోవు భయముల
మఱచిపోయెదను.

డాయుచున్నది 'రేపు', తాళుము
యా, యనుచు చెప్పకుము, రేపులు
వేయియగు రేపటికి, నప్పటి
కేమియయ్యెదమో.

౨౨

నాకుఁ గూర్చెడు మిత్రు లెందఱో
పాఱిపోయిరి మెల్ల మెల్లఁగ
వీఁక మృత్యువుముందు వారలు
నమ్రులై నారు.
నాకు వారికి మిత్రులస్నేహము
కాక యేమయ్యె నొకటో రెం
డో కదా గ్లాసులను త్రాగియు
వెడలియున్నారు.

౨౩

విడిచి యీగదిలోన మనలకు
వెడలిపోయిరి వారు సొబగున
నొడలు సింగారించుకొని వా
సంతికయు వచ్చెఁ.
అడర నేటికి మనము కూడా
నడువవలె భూశయ్యకిందికి
అడఁగెదము శయ్యవలె మనమును
నెవ్వ రెవ్వరికో!

౨౪

ఉన్నకాల మదె తోలేము.
మన్నులో దిగవలెను మనమును
మన్ను మన్నునఁ గలిసి పోవగ
సున్నయౌనంతా.

చిన్నబోవకు దుఃఖమొందకు
కన్న సంగీతమును మఱువకు
చిన్ని మోహిని వదలకుము, మధు
రసము వీడకుమీ.

౨౫

నేఁటి కొఱకై పాటుపడెదవు
ఏటికిని రేపంచు వేచెద
కోటియత్నము లెల్లయువియని
మెఱుఁగ లేరేమీ.

పాటపాడెడు వినుము చీఁకటి
కోట బురుజున నొక్క భూతము
మాటవినుఁడీ "మూర్ఖులిచ్చట
నచట లేద"నుచు నొక్కింత ఫలమైనన్.

౨౬

ఎంతో జ్ఞానుల మనుచు నిక్కుచు
వింతవాదముఁ జేసిరా రా
వంత తెలిసిరె యిహపరంబుల
గుట్టునెవరైనన్.

ఎంతవా రీఋషులు యోగులు
వింతమాట లటంచుఁ గేలియు
నంతలోనే యందఱికిఁ బలె
నోటమన్నె కదా.

౨౭

చిన్ననాఁటను పోయి యెంతో
విన్నవాఁడను పెద్ద శాస్త్రము
లెన్నొ సిద్ధాంతంబు లంయెడు
రిత్తమాటలను,

విన్నవా రెవరైన లేరు
కన్నవారును మొదలె లేరు
తిన్నఁగా మన బయలుదేరిన
తావు చేరెదము.

౨౮

అట్టి పండితు లట్టిజ్ఞానులఁ
బట్టి నాటితి జ్ఞానబీజము
పెట్టినీటిని దోహదంబుల
నెన్నొ చేసితిని.
ఎట్టిఫలమని యడుగఁ బోకుము
ఇట్టి వచ్చితి నీటివలె నే
నట్టి గాలికిఁబోలె నెగిరితి
ననుటయే ఫలము.

౨౯

ఏమిరా గార్జన్య మియ్యది
యేమి యడుగక యిందులోనికి
నేమి యడుగక యిచటినుండియు
గెంటుచున్నారు.
ఈ మధువు కూడదని చెప్పిన
రీ మధురరస మింత తనియఁగ
నేముత్రావుచు నిట్టి యవమా
నమును మఱచెదము.

౩౦

ఇందులోనికి వత్తుమంట, యది
యెందుకో యొక్కింత తెలియదు
ఎందునుండియొ యంతకంటెను
అసలె తెలియదుగా.

ఎందులకొ యిటనుండి, యింతయు
సందియముగద; నీటిబోలెను
ఎండొ పరుగిడి గాలివలె నెటొ
యెగిరి పోయెదము.

౩౧

భూమిమధ్యను నేమియున్నదొ
యేమిగలదొ శనైశ్చర గ్రహ
ధామమం; దీరెంటికి మధ్యను
గల్గువింతలను.

నేమమున నేఁ దెలిసికొంటిని
ఆ ముడుల నేనెల్ల విప్పితి
నేమిచిత్రమొ కర్మబంధమె
విడకయున్నయది.

౩౨

ద్వార మొక్కటి యున్న దచట న
యూరె! బీగము వెచటనున్నదో
యేమునెత్తఁగ రాని తెరయును
గప్పియున్నయది.
వాగునచ్చట 'నిన్ను' 'నన్ను'ని
యూరకే యనుకొనుచు నుందురు
తీరు నదియును నీవు నేనును
కదలి పోవఁగనే.

౩౩

దీని మర్మము భూమిరైనను
బూని తెలుపదు; నల్లచీరెల
నూసి శోకించుచును నుదధులుఁ
బ్రిభువు వీడుటను
దానిగుట్టును చెలుప, వాకా
శాన సంజ్ఞలునైనఁ గలుగవు
దాని రేఖుంబవళు లనియెడు
నవియుదాచుఁగదా.

౩౪

తెరవెనుక నాలోని నిన్ను
నరయ నీచీఁకటిని దీపము
దొరకునని చేయెత్తి వెదకితి
దొరకదయ్యెనది.
అరయుచుండఁగ నెచటినుండియొ
"కరము నీలోనున్న నేను
అరయఁగన్నులు లేనివాఁడ" న
టంచు వినవచ్చెఁ.

౩౫

అప్పుడీ మృత్పాత్రిఁ బెదవికి
చప్పానను జేరిచియు నడిగితి
"చెప్పుమా యీజీవమర్మ" ము
టంచు వేడుకను.
విప్పి పెదవుల నదియుఁ దెలిపెను
"తప్పిపోయిన బోవు జీవము
లొప్పియుండఁగ మధురపానము
గ్రోలి సుఖపడుమీ."

౩౬

అనెషు మృణ్మయపాత్ర యియ్యది
వినుచుఁ దనచెలి తీయుమాటలఁ
గనుచు సౌఖ్యము, గ్రోలిమధువును
దిరిగ నొకయప్పుడు.

చనవుతో నిప్పుడేను ముద్దులు
గొనిన యిది పూర్వమున నెంతటి
యనువుతో ముద్దులను నిచ్చెనొ
ముద్దులంగొనెనో.

౩౭

మట్టిపాత్ర యిదేమి ముద్దుల
వెట్టినని సంశయమువలవదు
నెట్టు దారినిపోవు కుమ్మరి
నొకనిఁ జూచితిని.

గట్టిగా మర్దించెఁ బచ్చి
మట్టిఁ బట్టి యతండు, "నంత
గట్టిగాఁ గొట్టకుమి యన్నా"
యనుచు నదిపలికెన్.

౩౮

తరతరంబులనుండి యీకథ
తరలి వచ్చినదేకదా మఱి
విరళముగ నొక మట్టి ముద్దను
చఱచి మర్దించి
పరగ మానవ దేహమనుచును
గరమునను గొని యొక్క కుమ్మరి
యరుదుగా నిర్మించె దీనిని
ఇష్టమగునట్లు.

౩౯

ఎన్నియో మధురసము బొట్టులు
చిన్న చిన్నవి పడును భూమిని
క్రిన్న నవి యిట్టింకు లింకుచు
పోయి పోవుచును,
ఎన్నడో యది యెంతకిందనో
మన్నుగాఁ బడియున్న కన్నుల
నున్న పరితాపాగ్ని నార్పఁగఁ
దోడుపడు నె కదా.

౪౦

గంటపువ్వును చూచినావా
కట కన్నును పెట్టి మంచుకు
నంటియుండుట, యట్లెనీ వు
త్సాహ మొందవయా.
వెంబనంటిన మృత్యుదేవత
మాగిటిలో నిను నుత్తపాత్ర
వంటివాడని బోరలించిన
యంతవానికైనన్.

౪౧

ఆశ కెక్కుడి కంతమున్నదె
పాశములు దుఃఖములు సుఖములు
ఆశలను పోద్రోలి యానం
దంబు నొందవయా.
నాశనంబగు నెల్లయది, యా
వేశమొప్పంగ మధురసంబును
పాశరహితుండ వగుచుం గ్రోలుము
ప్రియను గూడుచును.

౪౨

ఏల పోయినదినముకోసము
గోలచేయుచు నేడ్చుచుందువట
యేల యెప్పటి ఱేపు కోసము
బెంగఁ బూనుటలు
ఏలవచ్చితో యేలపోయెదో
యేల యీగొడవెల్ల? జీవము
గాలి కెగజిమ్మకుము, మధువును
గ్రోలి సుఖపడుము.

౪౩

లోతు తెలియని యాకసంబను
నూతిదరికిని జేరనప్పుడు
మాతయొద్దను బెట్టుదురు మధు
పాత్రినొకదాని.
ఖ్యాతిగాఁ జేకొనుము దానిని
బ్రీతిసేయుచు విడిచెదవుసుమి
ప్రీతినొందుచుఁ గ్రోలి యానం
దింపఁగావలయుఁ.

౪౪

ఓసి యాత్మా! యేమె యింతటి
గాసి? యయ్యొ! పవిత్రురాలవు
వాసిగా నాకసమునం దిరు
గాడఁ గలవుగదా.
పాసియుండఁగ నిచ్చగింపవు
గాసిపడె దీమంటికొంపను
వాస మొనరింపంగ నీకును
లజ్జకాదటవే.

౪౫

భూమియిది నశ్వరము, దీన మ
కాము చేసియు నాత్మసుల్తా
గీముగాఁగ గుడారమెత్తె శ
రీరమును దీనిన్.
కామితార్థము తీరినంత మ
కాము నెత్తుచు లేచు పాదుస
నేమమున మఱియొకని కియ్యది
వాసమగుచుండున్.

౪౬

ఓయి, నీవును నేను లోకముఁ
బాయఁగాని ప్రపంచమంతయు
నాయెనంచును దలఁపఁబోకు మ
దెట్లు జరుగు సుమీ.
పోయమానఁడు మద్యపాత్రను
చేయిచేర్చి యన తసాక్షి యు
పాయుమొప్ప ననంతసంఖ్యల
జీవబింబువులన్.

౪౭

తెరను ంచుక యవలమనమును
జరిగిపోయిననేమి? చిరముగ
జరుగుచుండును లోకమిట్లే
లోటు లేదయ్యా.
అరుగుదేరక పూర్వమైనను
గలిగెనే లోటింతదాఁకి
పరగునే నీపేరు గీర్తియు
నిచట నెల్లప్పుడున్.

౪౮

ఒక్కక్షణమె మకాము, మఱి యది
యొక్కపరిమె యెడారినూతను
జక్కఁగా జలములను గ్రోలుట
యంతలో నయ్యో!
పక్కనున్న బిడారు పూర్వపు
చక్కి లేమ నెడారిలోనికిఁ
జిక్కిపోదువుగాన వేగమె
త్రాగుమీ సీటిగా.

౪౯

ఓయి యీచిత్రింపు జీవము
మాయఁజెలియఁగ నెంతువా మఱి
చేయుమయ్యా యూహ వేగమె
తెలిసెదవొ యేమో.
మాయనఁగ సత్యంబును న్మఱి
పాయఁజేయున దొక్క వెంట్రుక
గా యెడము; సంశయమె పాత్రినా
ధారమగును గదా.

౫౦

అయ్యో! తలవెంట్రుకయె వాసిగ
చెయ్యిఁదప్పెను సత్య; మదియును
అయ్యో! యొకయక్కరమె తెలియక
వెదకెదము యేమో.

అయ్యదియుఁ దెలియంగవచ్చినఁ
దియ్యమున ధనగోశమే కా
దొయ్యనను దత్ప్రభువుఁ గూడను
కనఁబడునొ యేమో!

౫౧

అతి నిగూఢముగాఁగఁ దిరిగెడు
నతఁడు చంద్రునిమొదలు చేపల
వితముగా నెన్నెన్నొ రూపులఁ
బట్టఁబోయినను.

వెతలఁబడి యాయాస మొందిన
నతఁడు చంచలుఁడగుచు పారద
గతిని దప్పెడు; నన్నిమడియును
శాశ్వతుం డతఁడే.

౫౨

ఒక్కపరి ప్రచ్ఛన్నవృత్తిని
చక్కఁజూపవు ముఖమునేరికి
నొక్కపరి రూపంబు లెన్నియొ
పొంది తోఁచెదవు;
నిక్కమేమో తెలియకున్నది
యిక్కథయు నీవలననే కద
నిక్కముగ ద్రష్టవ్యుఁడవు మఱి
ద్రష్టవును నీవే.

౫౩

జీవమందలి మూలమర్మము
లీవునిచ్చటఁ దెలియఁగల్గినఁ
జావునొందుచు నీశ్వరుని మ
ర్మములు తెలిసెదవు.
నీవు నీతోనున్న నేఁడే
యేవిధమైనను దెలియనప్పుడు
నీవు నీతోలేని చేపట
నేమి తెలిసెదవు!

౫౪

చిల్లిగవ్వయుఁ జేయఁజాలని
బొల్లివాదములేల? కాలము
చల్లగాను గతించుచున్న దిఁ
కేల జూచెదవు?

ఉల్లమం దుత్సాహమూనుచు
కొల్లగా నీదాక్షిరసమున
నల్లపరితాపముల మఱచుచు
హాయిఁ బూనవయా!

౫౫

గొడ్డుభార్యను నేలికొంచును
బిడ్డలను గనకుండ వంశము
నడ్డెతనమున నంతరింపఁగఁ
జేయనొప్పనొకో.

గొడ్డుబుద్ధిని మొదటిభార్యను
మెడ్డివేసి విడాకులిచ్చితి
లడ్డువా యీదాక్షకన్యను
పెండ్లియాడితిని.

౫౬

ఒప్పుగా సదసద్వివేకము
మెప్పు పొందింపంగ, తత్త్వము
నొప్పుకొనఁగా, హెచ్చుతగ్గుల
నేర్పఱించితిని.
ఒప్పుతప్పు లవెల్ల నేటికి
గొప్పగా మధురసవివేకమె
గొప్పశాస్త్రమటంచు దాని
లోతుఁజూచితిని.

౫౭

గణితశాస్త్రమునందు మేటివి
అని జనులు నిను మెచ్చుకొందురు
గణితశాస్త్రమునందు సీకును
పరిజ్ఞయేమొ కదా.
అనుచుఁ దెలియఁగ నడిగెదవు, తే
పనెడి దొక్కటె, నిన్నయొక్కటి
వినుము పంచాంగములు లేవని
చాటుటయె ప్రజ్ఞ.

౫౮

నిన్న కల్లంగడికి ముందట
కన్నుచీఁకటిలోన వెలుఁగుచు
నన్ను డాసెను మద్యపాత్రను
చేతఁబట్టికొని
చిన్నదొక యప్సరస యదియును
తిన్నగా నాముందు నిలిచియు
'అన్న! దీనిని చూతువా రుచి'
యనుచుఁ బ్రశ్నించెన్.

౫౯

ఓయి ద్రాక్షఫలంబు గొప్ప
న్యాయశాస్త్రమునందు నిధిసుమి
పాయు దానను కలహములు మన
దేశమందెల్లన్.
ఈయదియు రసవాదమందు న
మేయకౌశలమొప్ప జీవము
హేయమయిన నమూల్యమౌనటు
చేయఁజాలుఁ జుమీ.

౬౦

అల ముహమ్మదుగజిని యల్లా
నిలను నమ్మనివారిఁ గత్తికి
బలియొనర్చినలీల ద్రాక్షయు
నాత్మఁ జుట్టికొని
కలియఁజేయు విచారములను
బలసియుండు భయంబులను నలి
నలియొనర్చియు నంతరింపఁగఁ
జేయఁజాలుఁ జుమీ.

౬౧

ఎవఁడురా దుర్వ్యసనమంచును
చవట మాటల నాడుచున్నాఁ
డవని నెల్లను దాసృజించియుఁ
బెంచి పోషించి
మివుల సద్వస్తువుఁ జేసెఁ
తెవులు తెచ్చెడివానిఁ గూర్చునె
చవులు పుట్టెడు ద్రాక్షరసమును
విషసమం బగునే?

౬౨

అరరే! జీవామృతము విడిచియుఁ
బరసుఖామృతమనుచు నెన్నటి
కొఱకో గుత్తను మిటకరించుచు
వేచియుందునోకో!

ధరను నేఁ గల యంతకాలము
సరససుఖముల ననుభవించెదఁ
దిరిగి మంటను గలియ నేమవు
నెవరి కే మెఱుక?

౬౩

నరకమున యమబాధలంట
సరససుఖమంట స్వర్గమందున
నరయఁజాలని దెల్ల బూటక
మొకటె సత్యముగుఱ

నరుల కీజీవంబు గుత్తకాఁడు
నరుడు కాదు గుటుక్కుమనుఁ జుమీ
విరియఁబూచిన పువ్వు మఱలను
మొగ్గ యెట్టు లగున్.

౬౪

వెడలిరే కోటానకోటులు
పుడమి వీడుచు నిరులు క్రిమ్మెడు
నడవి మార్గముఁబట్టి యొకఁడును
దిరిగి రాఁడేమీ?
అడిగి దారిని తెలియఁగా సరి
పడదు; మనమును దానిఁ గనుఁగొన
నడవి పోవఁగవలయు వేఱొక
దిక్కు లేదు కదా!

౬౫

ఎవ్వరో విద్వాంసులంట
ఎవ్వరో యోగీశ్వరులునఁట
ఎవ్వరో తెలిసికొని వచ్చిరఁ
టంట యీకతలు
ఎవ్వరయ్యా నమ్ముతాఁ రవి
పవ్వళింపఁగఁ గలను గాంచిన
వివ్విధంబునఁ దెలిపి వారును
బవ్వళించారు.

౬౬

నే నొకప్పు డగమ్యాగోచర
మైనదారిని నాత్మనంపుచుఁ
బూని యవ్వలివార్త నించుక
తెమ్మనుచు నంటిఁ
గాని యదియును బోయి శీఘ్రమె
కానవచ్చియు నాదుమ్రోలను
'నేనె స్వర్గము, నేనెనరకము'
నంచు వాక్రుచ్చెఁ.

౬౭

ఆశలే పరిపూర్తినొందుచు
నాశలే విఘ్నంబునొందుచు
నాశపెట్టుచు దుఃఖపెట్టుచు
స్వర్గనరకము లౌ;
ఆశ కనఁబడనట్టి చీఁకటి
దేశమేకద మొదటి వసతి, స్వ
దేశమునకే తిరిగి మఱలెద
మింతయును నిజము.

౬౮

తెరను వైచెను, తోలుబొమ్మలఁ
బఱచి యాడింపంగఁ దొడఁగెను
త్వరగ నొక్కటి యొక్కటేకొని
తీయఁగాఁ దొడఁగెన్
పరమమాంత్రికుఁ డతఁడు బొమ్మలఁ
బఱచి యాడఁగఁజేసె మనలను
కరమునను దీపంబుఁబట్టి వి
చిత్రగతు లొప్పన్.

౬౯

లోకమిది చతురంగఫలకము,
చీఁకటియు వెలుతురును గడులగు
వీఁకతోఁ జతురంగ బలమా
మనల నాడించున్.
సాఁకుచును నడిపించు నొక్కట
వే కదల్చుచుఁ ద్రోసిరాజను
వ్రేకదనమున నొక్కయప్పుడు
చంపి బరిణెనిడున్.

౨౦

బంతిఁబోలెడి నిన్ను లోకపు
వింతబయలాటను స్వారిచేయుచు
బంతియాటను త్రిప్పుచుండును
కర్మదండముతోఁ,
ఇంతయును నేమంచు నీవును
వింతగాఁ జూడంగ వలవదు
అంతయును నాతనికె తెలియును
అతనికే తెలియున్.

౨౧

ఆ లలాటమునందు నాతఁడు
లీలవ్రాసెడి వ్రాఁత నట్లే
కేల వ్రాయుచుఁ బోవుచుండును
ఆగఁ డొకయపుడు.
ఏల భక్తియు నేల యుక్తియు
నేల యీ కన్నీటిధారలు
చాలునే యావ్రాఁత నించుక
యేని తప్పింపన్.

౨౨

బోరగిలఁ బడ్డట్టి గిన్నెను
వార లాకసమనుచుఁ బిలుతురు
సారెకును బుట్టుచును గిట్టెద
మందు క్రిందఁగదా!
ఓరి! చేతులనెత్తి దానికి
చేరి దండము పెట్టనేటికి
మీరు నేనునునట్లె యదియును
శక్తిహీనకదా.

౨౩

అతిశయోక్తులె సత్యమంట
క్షితిని గావున చింతయేఁటికి
మతిని కలఁతను బొంది యుండకు
మోయి యెన్నఁడును
గతియెటున్నదో యట్లె పోవుము
వెతను బూనకు వ్రాఁతయెట్టి
గతిని పట్టునో దానిఁ ద్రిప్పఁగఁ
దరమె యేరికిని.

౨౪

నేఁటి వెట్టియు నిన్నఁబుట్టెను
పాటిగా ఱేపటను వచ్చెడి
యోటమియు మౌనమును విజయము
నాఁటనే పుట్టెఁగా
పాటిసేయక త్రాగురా, నీ
వేటికో, మఱియెచటి నుండియొ
యేటికో, మఱి యెచ్చటికొ తెలి
యంగఁ జాలవురా.

౨౫

జగము ప్రారంభించినప్పుడె
సుగతియో దుర్గతియొ నిర్ణయ
మగణితంబుగ నున్నయది య
ట్లుండఁగా నిపుడు
పొగులనేటికి త్రాగుబోతని
యుగిలఁ జేయఁగనేల పండ్లను
తగిన రీతిని బోయెదను నా
జోలి తలపకుము.

౨౬

నన్ను ప్రేమాధ్యయనపారగు
నెన్నొ విధముల మొదటి నుండియు
గ్రిన్నఁ జేసె నతండు నప్పుడు
హృదయ మందొక్క
చిన్నియణువును దీసి తత్త్వం
బన్న ధనకోశమును దెలుపఁగ
నన్ను తాళముచెవిగఁ జేసెను
ప్రేమమీరఁగను.

౨౨

నాకు తెలిసిన దొక్కటే యీ
లోకమందా జ్ఞానతేజము
వీఁక బ్రేమావృతివిఁ జేయఁగ
నిమ్ము, కోపమున
నాఁకటను దెగమ్రింగని మ్రా
వాఁకిటను నొక కిరణమబ్బిన
నాకుఁ జాలును జ్యోతి మొదటికె
కనఁబడని కంబే.

౨౫

జడపదార్థముతోడఁ జేసిన
యొడలిలో నొక యంతరాత్మను
వెడలఁజేయఁగ వలెనె? యదియును
గొన్ని సౌఖ్యములకై
విడువవలెనే కూడదనుచును
నుడువఁగాఁ బడినట్టి వానిని?
విడువకున్నను శిక్షలఁటవె? యి
వేమి చోద్యములో!

౨౬

మట్టిదేహము నప్పనిచ్చి
గట్టి బంగారంపు భక్తిని
గొట్టవలెనని తలఁచుచుందు వ
హాహా గడుసుఁదనము!
అట్టి దెప్పుడు నప్పనిచ్చితి
యిట్టివ్యాజ్యం బిప్పు డేఁటికి
ఎట్టు లొప్పుకొనంగ దానిని
వింత యయ్యెడును.

౨౦

పోవవలె నీదారి నందువు
త్రోవలో వలఁబఱచి యుంతువు
త్రావినను మఱియేమిచేసినఁ
గోప పడియెదవు

నీవె నాచుట్టునను వ్యసనము
లావృతంబుగఁ జేసి, నేనును
త్రోవఁదప్పిన పాపివంచును
దలఁచె దిదియేమి?

౨౧

నాకు స్వాతంత్ర్యంబు నీయక
నీ కరంబునఁ గర్మసూత్రము
వీకఁ బట్టుచు నన్ను ద్రిప్పుచు
నుండఁగా నీవు

నాకుఁ బుణ్యము పాపమంచును
సాకులను గల్పింపఁ బాడియె
యేకరణి నను గాచెదవో మఱి
నీదె భారమయా.

౨౨

అంత సాయంకాల మయ్యెను
చింత నాఁకలి యాఁకలోయని
వింతగా "రమజాను" పోయెను,
అంతటను నేను
కొంతసేపొక కుంభకారుని
పొంత మసలితి; నచట దొంతులు
దొంతులుగ నెన్నెన్నొ కుండలు
కూడి పడియుండెన్.

౨౩

ఎన్నొ రకముల కుండలుండెను
చిన్నవియు మఱికొన్ని పెద్దవి
కొన్ని కోలవి కొన్ని గుండ్రని
వుండె నాయింట
కొన్నిటికి మాటలును వచ్చును
కొన్ని వినఁగల్గినవి, కాని
తిన్నగా విని యూరకుండఁగ
నూహ మదిచేసెన్.

౮౪

“ఉత్తమనేనా నన్ను జేయఁగ
మొత్తనైన బంకమట్టిని
మొత్తి యీరూపంబు నిచ్చెను
కుంభకారుండు?
ఎత్తివేసిన బిడ్డలాడును
ఉత్తమన్నై మంటఁగలసెద
సొత్తెఁగా మనయందఱికిఁ” నని
యొక్క కుండయనెఁ.

౮౫

ఎవ్వఁడైనను కడుపునిండఁగఁ
బువ్వఁదాఁ దిన్నట్టి పాత్రను
రవ్వచేయుచు విరుగఁగొట్టునె
మిగులఁ గోపమునన్
ఎవ్వఁడీ తను వింతసొంపుగ
పువ్వువలె నిర్మించె నాతఁడు
నొవ్వఁజేయుచుఁ బాడుచేయునె”
అనియె మఱియొకటి.

౧౬

సాదు వొకఘటమంతరూపసి
కాదటంచును నలుగు రనఁగాఁ
జీదరించుచు నిట్లు సాహస
మొప్పఁ దాఁ బలికెన్,
"నాదురూపముఁ జూచినవ్వేద
రేదొ తప్పును చేసి కుమ్మరి;
కాదు, నను జేయంగఁ జేయుయు
వడఁకెఁ గాఁబోలు."

౧౭

అంత లొడలొడ మంచి మఱియొక
వింతకుండయుఁ బలికె నిట్టులు
ఎంతొ తెలిసినదానివలె మొగ
మెట్టు చేయుచును
"సంతయేమిది, కుండలందరు
వింతగా కుమ్మరి యటందురు
ఇంత తెలుపుఁడు కుండలెవ్వియొ
కుమ్మరియు నెవఁడో."

౮౮

"మనలఁ జేయుచు నున్నయప్పుడు
ననువు తప్పుచు వంకయైనను
కినుక తోడుత నావమునఁ బడ
ద్రొబ్బివేయునని
యనుచునుందు రదెల్ల కల్లయె
కనికరము గలవాఁడు నాతఁడు
తనపి తానే పాడుచేయునె?"
అనియె మఱియొకటి.

౮౯

"వారు నా జీవంపుమొలకను
వేరితో బెల్లగిలఁ దీయుచు
దూరముగ గొమ్మలను జీల్చుచుఁ
బాఱ వేయఁగనీ
చేరి నే నైనట్టి మంటిని
కోరికను మధురసము పోసిన
వేరు తన్నుఁ దిరిగి లేచెద"
ననియె మఱియొకటి.

౯౦

వాదముల నవి యిట్లు సలుపఁగ
ఖేదమున 'రమజాను' పోయెను
మోదమున 'షవ్వాలు' వచ్చెను
ప్రీతి నింపుచును
మీఁద వాహకు లపుడు వీఁపుల
మీఁద కావడిఁ జేర్చి కుండల
నాదటను వే మోసికొంచును
నడువఁ జొచ్చిరటన్.

౯౧

ఇంక నెన్నో నాళ్ళు బ్రదికే
దింక లేదుసుమీ యిహంబున
శంక చేయక మధురసంబును
పోయుమీ నాథున్.
క్రుంకిపోయినపిదప నల్లురు
నింక విడువక యుండి, దాత్రుల
వంకఁగొని పోవుచును నచ్చట
పూడ్చియుంచు మయా.

౯౨

కలిసిపోయియు మంటిలోపల
నిలిచియుండఁగ నందు ద్రాక్షలు
మొలచి తీవలఁ బర్వఁజేయఁగ
నవియుఁ బ్రాఁకుచును
నెలమి భక్తులు నట్లుపోవఁగ
కలయఁగాళ్ళను బెనఁగి పట్టుచు
తెలివినిచ్చును గాక, వారి వి
చారమును ద్రోలి.

౯౩

నేను బశ్చాత్తాప మందుచుఁ
బూని ప్రార్థింపంగఁ దొడఁగితిఁ
గానఁబడె స్వర్గం బటంచును
నూహ చేసితిని
కాని యీ మధురసముఁ గ్రొంచె
మానఁగానే భక్తియంతయు
కానఁబడకుండంగఁ బోయె న
దేమి చిత్రమహా!

౬౪

ఎన్నో సారులు చింతచేసితిఁ
గ్రిన్నమధువును గ్రోలిలనంచును
తిన్నగా నీమనసు నిలువ ది
కేమి చేయఁగలన్

చెన్ను మీఱు వసంతకాలము
వన్నె హొయలు గులాబి పువ్వులఁ
గన్నుపండు వొనర్చెఁ బశ్చా
త్తాప మెట్టిదిఁకన్.

౬౫

మదిర మను సీహాంతకారిని
మదిని నిల్పఁగఁ బరువు పోయెను
అదియు నుండిన లేక యుండిన
నేమి నాకింకన్

పదిలముగ నాతనువులోపల
కుదురుకొని ప్రాణంబు లుండఁగ
నదను తప్పిన నెట్లువచ్చునో
దీని నెటు విడుతున్.

౯౬

అయ్యో సొగసుగులాబి పోయెదె?
అయ్యో చనెదె వసంతమా? నా
తియ్యనౌ యౌవనము వెడలెదె
తావిఁ గోల్పోయి;
ఒయ్యనను శాఖాగ్రమందున
వియ్యమాదించితివి చెవులకు
తియ్యపాటల భరతపక్షీ
నీవు విడిచెదవే!

౯౭

జీవనంబను నీయెడాఁవి
పోవుచున్నాళ్లోకదా మఱి
పోవఁగా నిటఁ దిరిగి వచ్చుట
యున్నదో లేదో,
చావునిత్యము బ్రతుకునిత్యము
యేవిధముననుఁ దెలియరాద
య్యో! విచారమె నిత్యమని ని
శ్చయము చేసితిని.

౯౮

కర్మమను నీపుస్తకములో
మర్మమున వ్రాసేటి వ్రాతను
ధర్మదేవత చేరి యించుక
మార్చినను సరియే
యోర్మితక్కువదైన దానిని
గూర్మిమీఱంగఁ జెఱపి వేయుచు
ధర్మముం గట్టికొనినన్ సరె
యింత సుఖపడుదుౕ.

౯౯

ప్రియసీ! యిది దుఃఖపూర్ణము
మాయచే నావృతము లోకము
మాయచేయుచు సృష్టి మనచే
తులను బట్టితిమా
చేయమే హృదయంగమంబగు
చాయ దీనిని తారుమారుగ
హేయమగు సర్వమును బాఱఁగఁ
ద్రోసి స్వేచ్ఛగను.

౧౦౦

లేదు జీవను మాట యెచ్చట
రామపాత్రము పోయినను పాటి
స్వాదుమధురసపానమున సం
తోష మొందవలెగా.

మోదమున నీ చల్లవెన్నెల
లోఁ దమిం దిరుగాడవలయును
పోద మాతరువాత యెచ్చటి
కో యు దిప్పుడేలా?

౧౦౧

మిత్రులారా, పోయెదను సుండి
మిత్రుని న్నను మఱువకుండుఁడి
మిత్రులందఱుఁ గూడి వేడుక
తోడ హాయిగను

చిత్రసంభాషలను మధువు ప
విత్రమంచును త్రావునప్పుడు
నాత్రమున నేఁ జూతు నాకును
బోయ మఱువకుండీ.

---

